# కృ త జ్ఞ త.

సీ॥ భవ్యభోగంబుల భాసిల్లుటం జేసి
సుమనఃపురసమమ్ము సాలసపురము
పరిసరవాహినీ పరివృతంబగుటచే
సుమనఃపురసమమ్ము సాలసపురము
యున్నతసౌధాళి యొప్పారుటం జేసి
సుమనఃపురసమమ్ము సాలసపురము
సురసాలతరువాటి శోభిల్లుటం జేసి
సుమనఃపురసమమ్ము సాలసపురము
గీ॥ సంతతము సుధర్మోచితస్థానమగుటఁ
జూడ సుమనఃపురసమమ్ము సాలసపురము
కనకరత్నాలయంబయి గ్రాలుకతనఁ
జూడ సుమనఃపురసమమ్ము సాలసపురము.

సీసమాలిక.

శ్రీమంతమై యశశ్శ్రీరంజితంబగు
సలలితవైశ్య మండలమునందు
గుజ్జముపేరటం గోమరారు సాంప్రదా
యము జగద్ధేయమై యవతరించెఁ
దద్వంశజాలలోన దానరాధేయుండు
సదమలకీర్తి బుచ్చయ్యసెట్టి
యాతనికులసతి కానందదాయియై
నందనుం డుదయించె నాగసెట్టి

వానియనుఁగురాణి పావనచారిత్ర
విమలగుణకదంబ వేంకమాంబ
తద్గర్భశుక్తిముక్తామయరత్నమై
హనుమానుఁడనుశ్రేష్ఠి యవతరించె
నతనియిల్లాలు మహాలక్ష్మి కాంచెను
దనయుల నిద్వర ధన్యతముల
నందగ్రజుండు నాగయసెట్టి యొప్పువీ
రయ్య యగ్గుణనిధి కవరజుండు
హరిగుణాఢ్య మహాలక్ష్మిఁ బెండ్లాడి
దత్తపుత్రుని గుణోత్తము గ్రహించె
గుణరత్నవారాశి కోటివీరయ తన
యన్నపుత్రుఁడు తోడై నటింప

గీ॥ ఉభయవిత్తసహాయ్యంబులొప్పమీర
సూక్తిరత్నావళిని సుప్రసక్తి వెలయు
నట్లు ముద్రింపఁజేసి రాయామినీంద్ర
తారకంబుగ జగతిపైఁ దనరునట్లు.

సీ॥ ఎవరిసంపల్లక్ష్మి హిందూమహాజన
విద్యాభివృద్ధికై విజ్రుంభఁగ
నెవరిదాతృత్వంబు ప్రవిమలద్విజకోటి
సంతుష్టికై యున్నసతిమయ్యె
నెవరియశోలతానవనవాంకురములే
దివిజగంగ మునింగి దెసలఁబాఁకె

నెవరి సద్గుణపుంజ మవిరళతరతార
కావళికంటె నత్యధికమయ్యె
గీ॥ ఎవరు తమమానసముల ననవరతంబ
దివిరి నాదెళ్ళ రామయదేశికేంద్రు
పాదసేవాభిరక్తికై బరపుచుందు
రట్టి వీరయ కోటివీరయలు ఘనులు.
సీ॥ పెట్టించి రెవ్వారు పృథులాన్నసత్రంబు
పాటిమీరిన రుద్రపాటియందు
యిచ్చి రెవ్వార లహీనమాన్యక్షేత్ర
ములను సత్రమునకై సొలసయందు
ధనమిచ్చి రెవరు విద్యావృద్ధిగావింప
బోలుపుమీరు ఫిరంగిపురమునందు
జేసి రెవ్వారు గురుసేవలు శేముషీ
పాటవంబున గొట్టిపాటియందు
గీ॥ వారు వైశ్యకులీనులై వరలువారు
గుప్తమనుపేర నొప్పారుకులమువారు
ఉచితవృత్తి సదావృత్తి నొసగువారు
పేర్మిగలవారు వీరయపేళ్ళవారు.
గీ॥ భాసురంబగు సొలస వేంచేసియున్న
మంగళాదేవి నెనయు శ్రీరంగధాము
డాయురారోగ్యపుత్త్ర పౌత్త్రాభివృద్ధి
గుప్తముకులంబునకు నొసగూర్చు గాత.

కం॥ సంతోషవహుని సంతత
శాంతరసోద్భాసితాత్ము సమరసకరుణా
స్వాంతుఁ గోణపర్తి లక్ష్మీ
కాంతుని నాహితుని బ్రోచు గౌరీసుందర్.



ఆస్మద్గురుచరణాభ్యాంనమోనమః

# శ్రీ సూక్తిరత్నావళి.

భక్తపారితోషికము.

ఉ॥ శ్రీజగదాత్మ జ్ఞానిజనచింతితపావననాము నీలరు
గ్భ్రాజితదేహు రాఘవుని రాజ్యధురంధరుఁ జేయుచో మహా
రాజులు తాపసు ల్కవులు రంజిల సీతగళంబునందిడ
స్ధిజితశేష తార్కొత్తి ఘతిద్యుతిహారము నీవె మారుతీ! ౧

కృతకదాంపత్యము.

చ॥ సతతము భీష్మపుత్త్రి విడఁజాలఁడు మన్మథమోహితాత్ముఁ
గతియిఁక నేమి నాకనుచుఁ గాంతుపయింబగఁబూని లోనస ద్రై
మ్మతినివహించు సత్యఁగని మాధవవిరోధముమాన్పి మాయచేఁ
జతురవచస్కుఁడై ముదముసల్పెడుకృష్ణు భజింతు నెప్పుడున్

స్వయంవరము.

ఉ॥ ఏసతి శౌరిచేతఁ దనయాప్తితము ల్వడయంగ, వార్తలన్
భూసురవర్యుచే వినిపి పూజల గౌరిని దప్పి ద్వారకా

వాసునిచే గ్రహింపఁబడి భావవిశుద్ధతఁ బ్రీతిఁ జెందెనో
యాసతి రుక్మిణి న్మది నహర్నిశముల్భజియింతు రార్థిగన్

స్వాధీన పతిత్వము.

చ॥ శిరమున గంగఁ దాల్చుఁ దనచెంతవసించిన సన్గనంతు;సుం
దరియని దానిమెచ్చు ననుదక్షతనూభవఁ గిన్క—మాన్పన
త్తరి మృదువాక్యశైలిని మదర్ధశరీరము నీకొసంగితి
న్మరుపకుమత్కృతజ్ఞతను మానినినీ వనుశంభుఁగొల్చెదన్

గుణత్రయవిభాగము.

చ॥ మొదలనుమూర్తులన్ముగురముచ్చటగాను సృజించివారికి
యదనున సృష్టిసంస్థితిలయంబు లనందగుకృత్యముల్ముదం
బెదఁగొన నిచ్చి వాఘురిసతీశసతీమణిరూప మూనుచుం
బాదుపుగ భక్తపుంజమును బ్రోచు మహేశ్వరినాశ్రయిం
(చెదన్

భార్యాపరవశత్వము.

ఉ॥ వ్యాసవసిష్ఠశౌండసనకాత్రిశుకాదులు పల్కు స్తోత్రవి
న్యాసములందుఁదద్దయు మనంబునుగూర్చినవాఁడుగానభా
షాసుదతీసుగీతమున సాత్తముచేయుచు నూత్నసృష్టిఁజే
దాసను బొంది మించుకమలాసను వాసిని సంస్మరించెదన్

స్త్రీవినోదము.

ఉ॥ పాణిని వీణఁబూని సితపద్మమునంగొలువుండి పద్మజు
న్జాణతనంబుమీఱ మదిసంతసమందఁగఁజేసి పాటచే
శోణదృగంచలంబులను శోభిల లోకము లేలునట్టి యా
వాణిని ధ్యానసంభ్రమను వారకగొల్చెదఁ దద్దయాప్తిశ

స్తోత్రము.

చ॥ సుజనులఁ బ్రోచు ప్రోడను విశుద్ధసమస్తకళానివాసు నీ
రజభవముఖ్యదేవగణరంజితపాదు గిరీంద్రపుత్రికా
నిజవదనాబ్జభాను స్తవనీయవిచిత్రఫణీంద్రభూషణుం
గజవదనున్ భజించెద సుఖమ్ముగ మత్కృతి సాగ సమ్మతిన్

ప్రాచీనకవిస్తుతి.

ఉ॥ ఆనత సర్వలోకుఁడగు నాదికవీంద్రుని నాకుజాతునిన్
మానికులాబ్ధిసోము సురమాన్యుని వ్యాసునిఁ గాళిదాసుఁ బ్ర
జ్ఞానిధి నన్నపార్యుఁ గవినాయకుఁ దిక్కన నెఱ్ఱప్రెగ్గడ
న్మానక కొల్తుఁ; బేర్కొనుట మానెద దుష్కవికోటి నెంతయున్

గురుస్తుతి

ఉ॥ ఆటలపాటల న్గరపు నజ్ఞులతోఁ జెరలాడనీక ము
మ్మాటికిఁ దమ్ముఁడన్న యభిమానముఁ దోడ్పడఁగా వ్యపారము
ల్పాటన మొప్పఁ జెప్పి ననుఁ బాలనఁ జేసి యశంబు దిక్కులన్
సాటిన వేంకటప్పయ విచక్షుణు మద్గురు నాత్మ నెంచెదన్.

అదృష్టము.

ఉ॥ పండితుఁ డొక్కరుండు పసిబాలురఁ జేరిచి విద్య నేర్పనం
గొండొక కాలమందుఁ గనఁ గొందరె విద్యకుఁ బాత్రులౌదుర
చ్చండమహాలాలి దున్ని వెదఁజల్లిన బీజము లంకురించి ప్రో
ద్దండతవృష్టిసోక ఫలితమ్మగునే యవి యెల్ల నెల్లచోన్ ౧౧

గాంభీర్యము.

చ॥ కనుఁగొన సాధుమానసము కష్టపరంపర లొక్కపెట్టున
న్బనివడి దూకసాగిన విపాకముఁ జెంది చలింప నేర్చునా?

గనలి విపత్పరంపరలు గాంధిమహాత్ముఁడు పిచ్చలింపఁగఁ
బెనఁగొని పైఁగొన న్మనసు పేదరికంబు వహింపఁబోవునే.

పరకార్యసాధనము.

ఉ॥ ఏడులుపూఁడులంచు మదినెన్నరు పూనినధర్మకార్యమం
దోడరు దుర్భరంబని కృతోద్ధతులైనమహాత్ము లివ్విధం
బేడ నదెట్లన న్విషధరేశుఁడు వేయిశిరంబులందుఁదాఁ
గూడును నిద్రమానికొని కుంభిని దాల్పఁడె సర్వకాలముల్

ఉ॥ లోకములోన మిత్రునకు లోలత మేలిమిఁగోరి ప్రాజ్ఞుఁడా
ప్రాకటకార్యసాధకతఁ బ్రాప్తభరుండయి కష్టమొందు సు
శ్రీకరమైన హాటక మచేతనమైనను స్వర్ణకారుచేఁ
గాకకు లోగి ఖండములుకాదె యలంకృతిగాఁగ నొప్పకై.

విధికృతము.

చ॥ అధికధనాఢ్యుఁడంచు తనయాప్తునినెంతయునమ్మిహృద్యమా
విధమున రాత్రియుంబవలు వీడకకొల్చిన భాగ్యమబ్బునే?
విధిగతిఁ గల్గునద్దియు; గుబేరునిజేరి గిరిన్వసించుమ
న్మథమథనుండుభైక్షమును మానఁగడంగునెలబ్ధయత్నుఁడై

దురదృష్టము.

ఉ॥ పుట్టినవంశమారయ సుపూజితమైనను మానవుండు తా
నెట్టితపంబుఁజేసిన నరేశ్వరుఁడైన మహావిపత్తులం
బట్టునద్రోయ తేఁడిలను బాండుతనూజులు రాజ్యసంపద
లట్టడఁబాసి దుర్గములఁగష్టములొందరె ద్వాపరంబునన్.

లౌభ్యవృత్తి.

చ॥ వసుమతి లోభి మిక్కుట మవారితశక్తిధనంబుఁగూర్చినం
బొసఁగఁదదర్థ మన్యులకు భోగ్యముగావుటఁజూడమేరహిన్
మసలుచుఁదేనెటీఁగలు సమంజసవృత్తి గణించు తేనియ
ల్వొసఁగనిసర్వమానవులు వేడ్కభుజించుట లబ్ధమే ధరన్ ?

లుబ్ధవిత్తము.

ఉ॥ రొక్కముఁబెల్లుఁగూర్చిననరుండు జగంబునలోభమూర్తియై
యొక్కపుడైన నిచ్చుటకు నోపమిఁ దద్ధనలక్ష్మినింద్యమా
చక్కనిపూవుఁబోఁడిఘనచారువయస్క భ్రమించిపుంస్త్వముం
దక్కనయొక్కషండునకు దక్కివినిందితకాదె యుర్వరన్.

జంతునైసర్గికము.

చ॥ కుజనుఁడు సజ్జనంబులనుగూడి నిరంతరముఁ స్జరించిన
న్నిజమగు దుష్కృతిన్విడువ నేరఁడొకప్పుడునైన భూమిన
క్కజమగు ప్రేమచేతఁ జిరకాలముఁబాలను బోసిపెంచిన
న్సుజనుని సర్పడింభకముస్రుక్కఁగఁ బీకదె పంటమిత్తియై

ఉ॥ మంచితనంబుచేఁగుజనుమానస మెంతయు సత్పథంబుఁబ్రా
పించువిధంబుఁజేయఁగను భేదముఁజెంది వెసందొలంగెడున్
ఇంచుక వంకమానునెకొ యిజ్జగతి శ్వనకంబుతోఁక బం
ధించినఁగాని దండమునఁ దీరనియత్నముఁ జేసినం దుదిన్.

దాతృత్వము

ఉ॥ దానగుణాభివర్ధనుఁడు దైన్యమున న్నొనియాడునర్థులం
బూని తదీప్సితార్థమును బొందఁగ జేసి సుఖంపఁ జేసెడున్

మానుగఁ బ్రావృషంబునను మానక మేఘుఁడు చాతకాళికిం
దీనత మాన్ప నీరమిడి ధీరుఁడన న్యశమొందకుండునే ?

సహజదౌష్ట్యము.

చ॥ అరయఁ దురాత్మకుండు తనకంతకుఁడై నికటంబుఁ జేరినన్
ధరను బరోపకారపరతంత్రుఁడు వానికి మేలె చేసెడున్
నరుకఁగు తారమొత్తికుహానామునకొక్కఁగఁ దన్నుఁడాయరాఁ
దరువర మాత్మశాఖలను దట్టపునీడ నీదె వానికిన్

పరోపకారము.

ఉ॥ కొందర నాశ్రయించికొని కోవిదుఁ డొక్కరుఁ డాదరంబునం
గొందలమందియైన నోరఁగూర్చునుగాదె మహోపకారముం
బొందుగ వారివాహుఁడు సముద్రముఁ వేఁడి జలంబు దెచ్చియా
నందముఁ గూర్పఁడే మిగుల నారసముఁ బ్రాణులకిచ్చి ధారుణిన్

విద్యాప్రాధాన్యము.

చ॥ చదువరి కాని మానవుఁడు సజ్జనసన్నుతశాస్త్రపద్ధతికో
విదుఁగన రూపమొక్కటియెవెంట సభన్గనుపించు భేదము
న్బదఁపడి కాకికో వెలయుఁ బంచజనాళికి వన్నెతుల్యమై
విదితవసంతకాలమున వేరగు నెల్గున జాతిభేదముల్

ఉ॥ ఆరయ గొప్పవంశమున సభ్యుదయంబును గాంచిన న్నరుల్
భూరివిలాససంపద లమోఘముగాఁగ వహించినం గళా
శూరులు కాకయున్న సభ శోభిల నేరరు కింశుకంబు శృం
గారముఁ గల్గియుండిన సుగంధవిహీనత మెప్పుఁ జెందెనే ?

సర్వసమత్వము.

ఉ॥ ఎప్పుడు ధార్మికుండు ప్రియమేర్పడ దానముయాచకాళికిం
దప్పకచేయుచుండిన బుధాబుధసంతతికబ్బుచుండెడిన్
దెప్పలుగ స్వలాహకుడు తీవ్రత వర్షపుధారలుంపగా
మెప్పగునేల నూషరపు మేదినిఁ జేరవె నిర్ఝరాత్తలై.

ఉ॥ భూరికృపారసంబుఁ బరిపూర్ణముగాఁ బ్రసరింపఁజేసి స
త్పూరుషుఁడార్యదుష్టజనపుంజములందు సమత్వబుద్ధియా
సారకళాప్రవాహమునఁ జందురుఁడు సర్వజనాలయంబుల
న్వారకముంచు నొక్కగతి వర్గములై పరిజలుల్లసిల్లఁగన్

గురుశిక్ష.

ఉ॥ ఒక్కఁడులోకమందు సమయోచితమైన యుపాయశక్తిచేఁ
జక్కనొనర్పవచ్చు విరసత్వముఁజెందిన లాతివారలం
బెక్కువచింపనేల పశుబృందముఁగాచెడువేళ మానవుం
డెక్కుడుదండముంగొనియ థేచ్ఛవిధింపఁడెయాలమందలన్

వంశహాని

చ॥ తలకొని దుర్జనుండొకఁడు ధర్మపథంబునువీడి యాప్తులం
గలిసి సదాత్మసంతతికిఁ గష్టముఁగూర్చిన వాఁడు భూమిపై
నిలుచునె మున్నుయోధనుఁడునిక్కముధర్మజుగాసివెట్టితాఁ
బొలియఁడె తమ్ములంగలిసి భూరిపరాభవమొంది దుష్టుఁడై

బంధుప్రీతి.

చ॥ కడుతడవైనకాలమునఁ గన్పడినంతనె బంధువుండు తాఁ
దొడిఁబడి యెల్లవారలకుఁ దోడనె పాణముఁలేచివచ్చెదున్
బొడమి నభోవిటంకమునఁ బ్రొద్దటుఁజేరినయంతమాత్ర రే
ముడిగినతమ్మి కరిష్మరఁ బ్రమోదముఁజెందదె సుప్రసిద్ధమై

జాతిసైపుణ్యము.

ఉ॥ మాటలతారతమ్యము సమర్థుఁడెఱుంగు రసజ్ఞుఁడౌటనా
రాటముఁజెందు టొక్కటె ధరన్విరసజ్ఞుఁ డెఱుంగనేర్చునా
హాటకపాత్రమం దిడుపయస్సలిలంబుల హంసనేర్పుమై
యోటమిలేక పాల్గుడుచు; నోపునె వాయసమెన్నిభంగులన్.

జ్ఞానప్రాధాన్యము

ఉ॥ జ్ఞానములేక మానవుఁడు శాస్త్రములెన్నిటిఁ జర్చ చేసిన
న్దానుబుధోత్తముండను ప్రధానయశస్సును గాంచలేఁడుగా
పూనియ దెట్లన న్మలినముం బరిపూర్తిగఁ గొన్న గ్లాసున
న్మానితదీపముంచి రుచిమత్వము సేకురు టెట్లు దానికిన్.

అపాత్రదానము.

చ॥ బుధనుత మంత్రరాజమును బూరుషుఁడొక్కఁడు చంచలాత్ముఁ
డధమునకిచ్చినంత నది హైన్యము నెందుమఱింత యెట్లన ద్రా
న్వాధిపరిపాకముం గనిన వీక్షణహీనుని చేత దర్పణం
బధివసియింపఁగా నమలమయ్యు నిరర్థకమాట తథ్యమా.

సత్పాత్రదానము.

ఉ॥ యాచకు లాశ్రయింప వినయమ్మున వారికళావిశేష మా
లోచనఁజేసి పాత్రుఁడని లోలత దానము సేయుటెన్నయా
కాచినగోఘృతం బనలకంపితపావకకుండమందు సం
కోచములేక వ్రేల్చిన నకుంఠితసార్థక మొందకుండునే. ౩౮

సత్యవ్రతము.

చ॥ ఇడుములఁజెంది పుణ్యజనుఁ డెంతకృశించినఁ బల్కుసత్యముం
దడబడి మారుఁబల్కుటకుఁ దప్పుడుత్రోవలఁ ద్రొక్కఁడెట్లన
న్బుడమిఁ ద్రిశంకునందనుఁడు భోగముఁగోల్పడి హీనవృత్తిచే
బడలి సమస్తకష్టములపాలయి సత్యము వీఁటిబుచ్చెనే. ౩౯

పితృవాక్యపరిపాలనము.

ఉ॥ పెద్దలువల్కువాక్యమును వేదమటంచు యథోచితంబుగా
నిద్దపుభక్తిఁబూని మదినిశ్చలతంజరియింప ధన్యుఁడౌ
యద్దియునెట్లన న్దశరథాజ్ఞ శిరంబునఁదాల్చి రాముఁ డ
త్యుద్ధతిఁగీర్తిఁగాంచె సమయోచితశక్తివహించి కానలన్.

మౌఢ్యము.

చ॥ తనమదిఁదోఁచకుండిన బుధప్రకరంబు సమీపమొంది నీ
తినిబలిమిగ్రహించి నియతింగనుఁదెల్పినఁ బూనకుండిన
స్వనటను జెందు మానవుఁడు వారితశక్తి విభీషణుండు రా
వణునకు నీతిఁదెల్ప నదివ్యర్థమొనర్చి చెడండె దుష్టుఁడై.

కేవల మౌఢ్యము.

చ॥ కుజనులఁగూడి జీవితముఁగుత్సితకార్యములందుఁజొన్పి తా
స్వజనులనేచుదుష్టమతి సర్వవిధంబులఁజేటుకై మనో
రుజఁగొనినీల్గు నెట్లనఁబరుండని పుత్రునిజంపఁబోఁజతు
ర్భుజువలనన్ హిరణ్యకశిపుండు నశించె విచారశూన్యుఁడై

కేవల మౌర్ఖ్యము.

ఉ॥ ఈధరమూర్ఖుఁజేరి చెవికింపగుపుష్కలనీతిమార్గము
న్బోధనొనర్ప బోధితసుబోధము వానికి దుష్టబోధమౌ
బాధనొనర్ప కేనరుఁడు పాలనుబోసిభరింప భోగికి
న్వేధఘటించు దుష్టవిషవృద్ధిక్రమంబునఁగల్గు నబ్బమై.

మహాపాపము.

చ॥ సిరిఁదులఁదూగి నిండితపుచేతలఁదక్కి నిరంతరంబుఁదాఁ
బరులకు దానమిచ్చి తుదిభాగ్యవిహీనతఁజెంది కీర్తిసం
భరితుఁడు కాఁడె మానవుఁడు మానుగ దైవముకంటగించిన
న్నిరుపమపుణ్యశాలి బలినెక్కొనలేదె మహాపథంబునన్.

దుష్టసాంగత్యము.

ఉ॥ ఒక్కనిచేవపూన్కిఁ దమకోటమిఁగల్గదటంచునమ్మి పెం
పెక్కనపేర్మిఁగాచుకొని యెంత చరించినఁ గీడుమూడదే
అక్కురురాజపుత్రశత మర్కకుమారునినమ్మి యుద్ధమం
దక్కట లచ్చికిందొలఁగియాపదఁజెందిరి క్రోధమూర్తులై

మహదాశ్రయము

చ॥ నిరతము సల్పమానవుఁడు నీతినిఁగోరి మహాత్ముఁజేరి యా
దరమునుగాంచితత్కృపను దద్దయుఁజెందు మహోన్నతత్వము
న్సురుచిరపుష్పసంకలితశోభన నూత్నతరైకతంతువు
న్నరుఁడు ధరింపఁగా గళమునన్ రహిమించదె పుష్పసంతతిన్

స్వజనవాత్సల్యము

చ॥ బలయుతుఁడైనవాఁడుతమపక్షమువారలధూర్తుఁడొక్కరుం
డలజడిపాలుచేయఁగ రయంబున నాపదఁబాపి సుస్థితి
న్నిలుపును గోపగోకులము నిక్కముగావఁడె యద్రి వేలిపై
నిలిపి మురారి దేవవిభునిర్మితవృష్టి భరించి బృందలోన్

దుస్స్వభావము.

చ॥ పరహితకార్యతత్పరతఁ బాటువడంగను జొచ్చుమానవుం
డరయఁ బరాంగనారతి నహర్నిశము స్మరియించుచున్న నా
తురతఁజెడు న్నిశాకరుఁడు దుర్గముఁడై భువనోపకారియై
గురుసతిఁగూడ క్షీణదశ గుందఁడె చేడ్పడి కాలతంత్రుఁడై

దుస్స్వభావగోపనము.

చ॥ మదిఁబరితాపముం గొనక మాయికకృత్యములన్వహించి తాఁ
బదుగురుఁగాంచఁ బెద్దవలెఁ బైపయిఁదోచుచునుండుదుర్జనుం
డుదధిఁ దిమింగిలాదికమహోగ్రపయశ్చర యుక్తినొప్పి తా
సదమలనీరమట్లు జనసంతతికిం గనుపించదే భువిన్.

అపూర్వసౌభాగ్యము.

ఉ॥ పుట్టినదాది మానవుఁడు పుణ్యగుణంబులకెల్ల నిక్కమై
చెట్టగుణంబొకండు తనుఁజెందిన హీనతఁజెందునే ధరన్
నెట్టన భోగ్యజాతము లనేకముగల్గి హిమాక్షితిఁబొందిన
న్బట్టునఁబర్వతాధిపతి భావముగాంచదె శీతశైలముల్

సౌజన్యము

చ॥ విమలులఁజేయునెల్లరను విష్ణుకథావళి శైవగాథలన్
సమరసమొప్పఁజెప్పి నిజశక్తికొలందిని బుణ్యదాతయై
విమలమనస్కుఁ డెట్లనిన విష్ణుపదోద్భవ గంగ లోకము
ల్విమలజలమ్ముఁదాలిచి పవిత్రతనీయదె పాపహంత్రియై

చ॥ సుజనుఁడు జన్మమెత్తి గుణశోభితుఁడై జగతీహితార్థమై
నిజచరితంబు సత్యమున నిల్పి పరోపకృతిన్ఘటించుఁదా
నిజకిరణప్రసారమున నిచ్చలు లోకముమెచ్చఁబద్మినీ
వ్రజమున కిష్టదాతయయి భాసిలఁడే రవితిగ్మధాముఁడై

లోకజ్ఞత

చ॥అనయము మానహీనున కనాదరణమ్ముఘటింతు రిమానికి
న్ఘనుఁడని కేలుమోడ్తురు జగజ్జనము లొప్పిడఁగాంచినంత; నె
ట్లనమనుజుండుబూడిదెరయుంబునఁద్రొక్కుటకుత్సహించు మం
డినయనలంబుఁద్రొక్కుటకు డెందమువందున నిచ్చగించునే ?

పార్థముఖ్యము.

చ॥ చెడుగులు లేకిబిడ్డలు విశేషముగా జనియింపనేల ? పు
త్రుఁడుగుణవంతుఁడొక్కరుఁడురూఢిగఁజాలఁడెవంశరత్నమై
పుడమి నదెట్లనంగ నుడుపుంజ మసంఖ్యగ నంబరంబున
న్వడలుటకేమి పున్నమను వెన్నెలరేఁడొకఁడున్నఁజాలడే

అ వి చ్ఛి న్న వి శ్వా స ము.

ఉ॥ ఎవ్వనియందునమ్మకము హెచ్చుగుచుండునో వానియందె కా
కెవ్విధి నాపఁ బూనిన నదెట్లును నిల్వఁగఁ బోదు చూడఁగా
నివ్వసుధ న్మనుష్యునకు నెట్టనఁ బారునది న్నరుండు తాఁ
గ్రొవ్వి నిరోధమేర్పరుపఁ గోరినమాత్రనె యద్దియాగునే ?

ఉ॥ చేరువఁదీసి కష్టదశఁ జిక్కులనెల్ల నుబాపి రక్షణా
భారయఁ జేయఁ బ్రీతుఁడయి యాతని నమ్మిచరించు మానవుం
డీరసమొందనేరఁ డదియెట్లన నిచ్చలుఁ గూడుఁ బెట్టి సాం
పారఁగఁ బెంప శ్వానము సదాశ నరు న్విడనాడనోపునే ?

ఆ త్మ శు ద్ధి.

చ॥ చెడుగులతో నొకండు కొను చెల్మిని దుర్గుణమబ్బదంచుఁ ద
ద్దుఁడు పలుమారుఁ బల్కుఁ బరిశోధనఁ జేయఁగనద్ది సత్యమౌ
విడువక నీటిప్రబ్బలి భువిందటసంస్థితమై ప్రవాహము
న్విడలఁగఁ దోడుతో న్మనిఁగి వెండి సుఖస్థితిఁ గాంచుఁ దొంటిమై

దౌ ర్జ న్య ము.

చ॥ ఒడిగి పరాజ్ఞకున్వెరచి యూరటఁ జెందని దీనమర్త్యులం
గదిమి భయంబుఁ జెప్పుదురు కాదనువారలజోలిఁ బోవ రే
యదనునఁ గొండరిజ్జగతి నారయ వ్యాఘ్రము లేడిపిల్లపైఁ
గదియును గాని గోటఁ జెనకంగలదే మృగరాజు నెత్తరిన్.

స్వ ధ ర్మ పా ల న.

చ॥ కుశలముఁ గోరి కోరికలఁ గొల్లగఁ గూర్చి ప్రజానురక్తిమై
వశమతిఁ బూని మానవులఁ బాలనఁ జేసిన నంతరాజు స
ద్యశముఁ గాంచు నెట్లనినధర్మతనూభవుఁ డేలి రాజ్యముం
దశదిశల న్స్వధర్మపరత న్వెలయించె యశమ్ము శమ్ముగన్.

## ఆత్మరక్షణము.

ఉ॥ ఎన్నననశ్వరంపుసుఖమేర్పడ నార్తతతి న్భరింపఁదా
సన్నుతుఁడై ప్రసిద్ధిఁగొనఁజాలును సత్యము మానవాళిచేఁ
గ్రన్నన మానప్రంపఁ; విను కర్ణుఁడు ధార్మికత న్వహించి యా
పన్నజనాభిరక్షకతఁ బాసకొనండె యశోబ్ధినిత్యముల్.

చ॥ పరులకుఁగీడుమూఁకనెడఁ బ్రాణమువీడుటకైన నోర్చి బా
ధురకృపఁజూపినాఁడపుఁడు తోడ్పడియెవ్వఁడు మేలొనర్చు; శం
కరుఁడు విపత్పరంపరలఁ గాంచి సురర్తుల నాశ్రయింపఁగా
గరళము మెక్కి యార్తులనుఁ గావఁడె వింతగ మృత్యుజేతయై

## ధనాశ్రయము.

చ॥ ధనయుతుఁడై నవసానవృద్ధి దప్పక బంధుగులాశ్రయింతు; రా
ధనము లయింపఁ దారపుడె దవ్వులకేగుదు రాతురంబున
న్వనిఁగొని సంతతింపుష్ప ఫలపాదపపుష్పరసంబుఁ గ్రోలఁ దాఁ
జను నళి యద్దిలేనతరి సాగునొకో తిలకింపవృత్తముల్.

## అనాత్మజ్ఞత.

చ॥ ధరఁ బరకార్యసాధనము ధైర్యముచేత వహింపఁబూనిన
న్నరుఁడు చిరంబుదై వగతి నాశనమొందుట సత్యమొందు మే
లరసి పరోపకారము సహాయములేక గణింపఁబూన శం
కరునయనాగ్నికీలలనుగాముఁడు భ్రుగ్గఁడెరూపుమాయఁగన్.

చ॥ మొనగలవానిపై తనదుమూర్ఖతఁజూపి దురంతకృత్యము
ల్పనిఁగొనిసేయుమానవుఁడు భంగపడున్ భుజశక్తిహీనుఁడై
చెనఁటియొకండు చేవగలచింతను గొడ్డలిచేతమోదిన
న్దనభుజసారమంతయును దగ్ధయువ్యర్థమునొందఁ ద్రుక్కుఁడే.

గుణప్రాశస్త్యము

చ॥ అరయఁగ మానవుం డొగిదురాత్మకుఁడైనను నిండుశ్రద్ధనే
మరకగణించినట్టికళ మాన్యత నెక్కుడుగాంచి భూషితా
భరణమటంచుఁ బేర్వడదె ప్రాణిభయంకరదీర్ఘపృష్ఠరా
ట్ఛిరమునఁ దేజరిల్లు మణి చేకొనునే యెప్పుడైన హైన్యముల్

దాంభికము

ఉ॥ శాత్రవుఁ డొక్కరుండు తన సన్నిధి లేమిఁ బ్రగల్భశక్తివా
జ్మాత్రముఁ జూపు వైరిఁ గని మాన్యవిహీనత డాగు మర్త్యుఁడీ
ధాత్రిని రాత్రికాలమున దర్పముఁ జూపి తమఃకదంబము
ల్మిత్రుఁడు రా బిలాంతరవిలీనవిచేష్టకుఁ జొచ్చునల్లనన్

ఉ॥ పట్టును బట్టి యాచకులు పల్లరు వేఁడిన బూటకమ్ముల
న్బెట్టుగఁ బల్కి ద్రవ్యమును పీడక డాంబికుఁ డాపఁ జూచునె
ప్పట్టుల శారదాభ్రము నభస్థలిఁ గర్కశగర్జితాత్తమై
కట్టడి వర్షశూన్యతను గాంచదె లోకమెఱుంగ వెల్లనై॥

సారగ్రాహిత్వము

చ॥ సుకవు లుదాహరించు రసశోభితకావ్యములందు వర్ణన
ల్ప్రకటిత వాగ్మియా బుధుఁడు భావమునందు గ్రహించు; మూఢుఁ
వికలమనస్కుఁ డెంచునె వివేకిచకోరము పూర్ణచంద్రచం
ద్రికల హరించు; నేర్చునె హరింప మఱొక్కపులుంగు జాణయై

ప్రియవస్త్వప్రాప్తి

చ॥ హితవు వహించి మార్దవము నెంతయుఁ గాంచి వచించు మానవుం
డతులితశాస్త్రసంభరితుఁడై లభియించుట దుర్లభంబిల
న్నతతముఁ జూడ దుర్జనకు స్వాదువుఁ జూపి మతింతరోగికి
న్హితవుగ వ్యాధిమాన్పు లభియించునె యౌషధమెందుఁ జూచినన్

పరేంగితము

చ॥ కడకవహించి పండితుని కష్టముఁబండితుఁడే యెఱుంగు న
జ్ఞుఁడుతగఁదత్పరిశ్రమము సుంతయు నెప్పుడుఁగాంచలేఁడుగా
పుడమి నదెట్లనంగ విను పున్నె మెఱుంగనివంధ్య నేర్చునే
కడిమి వధూప్రసూతిభవకష్టపరంపర లోకనాటికిన్

ఆత్మరక్షణోపాయము

ఉ॥ శాత్రవబాలు బాలుఁడని క్షత్రియుఁడాత్మఁదలంచివీడ నా
శత్రుకుమారుఁడే పరమశత్రువుఁడై తనపాలిమృత్యువౌ
గాత్రమునందు దుర్వ్రణము గల్గిన నిష్కృతిసల్పకుండిన
న్ధాత్రి శరీరధారులను దద్వ్రణ మేర్చునుగాదె వహ్నియై

మిత్రసహాయము

చ॥ పరబలభేదనమందు నిరుపద్రవమైన సహాయమేర్పడన్
నిరుపమశక్తిఁగాంచి యవనీతలమందు జయించుసర్వము
న్గురుబలశాలి మారుతము కొంకకతోడ్పడఁ బావకుండు సం
భరితమహాశిఖుండునయి భస్మముఁజేయఁడె సర్వలోకముల్

ఉ॥ ఎక్కుడువైరమూని బలమేర్పడి శత్రువు లాక్రమించినం
జిక్కును జైంద్రజాలుఁ డవని న్స్వజనవ్రజగోప్తుఁడౌటఁ జె
న్నక్కువఁ బార్థివుండుకడుమార్కొని పైకొనవృష్టికుండునే
యక్కట ధాత్రిమొక్కటిసహాయముగల్గినమానవుండెదన్

ప్రారబ్ధము

చ॥ కడుబలవంతుఁడౌ నరుఁడు కాలవశంబున లాతివారిచే
సుడిఁబడ నిక్కటుల్గుడిచి శూరతఁగోల్పడి కర్మబంధము
న్గడువఁగ నెట్లనన్నలుఁ డఖండపరాక్రముఁడయ్యుఁ జెందఁడే
యిడుములఁ భార్యఁబాయుటకుఁ గలిచేఁ బరాభవమొంది ఖిన్నుఁడై

ప్రతిజ్ఞాచరణనిర్వహణము

చ॥ మనసున సాహసంబొదవ మానధనుండు ప్రతిజ్ఞఁ జేసి సా
ధనమున నిర్వహించు బెడిదంబగు కష్టములొంది న్యాయమే
దని సభ భీముఁడుద్ధవిడి తీవ్రమహాప్రతినంబు రాజుపైఁ
బనిఁగొని సల్పి దానిఁ దుదిఁబట్టఁగఁ జేయఁడె మద్గుచెంగటన్

సుబోధము

ఉ॥ స్నేహితుఁడొక్కరుండు తనచెంతను జేరి ప్రియంబువల్కిన
న్సాహసవృత్తి నద్ది వినఁజాలనిమానవుఁడొందు నాపద
శ్శ్లేషనాగతి న్సుబుద్ధి వినఁజెప్పిన రాజనరేంద్రనందనుం
డూహనొనర్పమింజెడఁడె యుత్కటసంకటమొంది బేలయై

బంధుద్వేషము

ఉ॥ నిందనొనర్చి బందుగుని నేరములంగలిపించి మీఁదటం
గ్రిందునుమీఁదుఁ జేసిన నికృష్టుఁడు తత్సలమొందుఁదానె త
న్నందనుచేత నొక్కతరి నాఁడు మఱందిని భూరివంచనం
జెందఁగఁ జేసి కంసుఁడు నశింపఁడె యల్లునిచేత వధ్యుఁడై

సాహసాంకము

చ॥ పతికిజనించు కష్టదశ భండనభూమిని గాంచి విక్రమో
న్నతిఁ జెలరేగి వైరులను నాశముఁ జేసి మహాహవంబులో
మృతిగొని ఖ్యాతిఁగాంతునరుఁడొందుసుయోధను సేనలాజిస
మ్మతిబలినిచ్చిచచ్చియభిమన్యుఁడు కాంచఁడె వీరభోగముల్

శరణాగతవాత్సల్యము

చ॥ శరణనుమాటవిన్న నవిచారతదొట్టిల నాదరించి స
త్వరమునఁగావఁబూను వసుధ న్శరణాగతవత్సలుండు కి
న్నరుఁడుగయుండు భీతిలుచునారదుఁడంపఁగఁ ఖాండవేయుని
న్శరణని వేడఁ గావఁడె విచారణఁదక్కి కిరీటి మేటియై

### అమానుషకృత్యము

ఉ॥ శుద్ధమనస్కుఁడొక్కరుఁడసూయవహింపకతంద్రుఁడై క్రియా
సిద్ధివహించి కార్యముఁ బ్రసిద్ధిగఁ జేఁగొను సంతతమ్ము సి
ద్ధ్యుద్ధతిఁ గుంభసంభవుఁడహోయన దేవత లబ్ధివారి స
త్పద్ధతినొక్కనూరుఁగొని పానముఁ జేయఁడె పట్టిపోవఁగన్

### పాపఫలము

ఉ॥ మోసముగానలేక మదిమోహముఁగాంచి దురంతకృత్యము
ల్చేసినప్రాణి తత్క్షణము చెందు సహింపఁగరానిబాధల
న్వాసవు మంకుచేతలను వల్లభు నిల్వెడలించి నాఁడహ
ల్యాసతి కాంచదే దృఢశిలాకృతిఁ దత్ఫలమొక్క పెట్టుగన్

### వస్తుప్రాశస్త్యము

ఉ॥ ఒక్కఁడుచాలు నీప్సితము నొవ్వకతీర్పఘనుండు మర్త్యుల
న్నెక్కుడురాశలంగొలిపి బిచ్చముఁ బెట్టనిలోభులేల వే
ల్రొక్కముఁబోసి తెచ్చిన విరుద్ధపుగోగణమేల చాలదే
చిక్కని వేల్పుటావల వసిష్ఠునకు న్వరితుష్టిఁ జేయఁగన్

### గుణగ్రహణము

ఉ॥ శాంతినిధానులై దొరలు సంతసమాత్మవహించి సత్కళా
వంతుల నుత్తమాంగమున వన్నెగఁ దాలిచి సత్కరింతు ర
త్యంత మదెట్లన న్హరుఁడు తద్దయు నన్యులవీడి సత్కళా
వంతుని శీర్షమందు నెడఁబాయక దాల్పఁడె దేవదేవుఁడై

### ఇష్టానిష్టసూచనము

చ॥ విఫలములయ్యె మూర్ఖులకు వీఁకను సజ్జనవాక్యసంతతుల్
సఫలతఁ గూర్చుఁ బ్రాజ్ఞులకు; సాదరయోషిదపాంగవీక్షణం
బఫలమొనర్చు బాలకుల, కంగజబాధితయూనకోటికి
న్సఫలతఁ గూర్చు నిజ్జగతి సాంద్రవిరాగసురాగదాయియై

### అవివేకము.

చ॥ అతులితభావసంచయరసాత్మకకావ్యముఁ గాంచియాత్మలోఁ
సతతమునిందఁజేయుమది జాడ్యముగూరిచి ఖేదమొందఁబోఁ
డతనుజడత్వధారి సముదంచితకంచుకమున్ధరించి వి
శ్రుతగతినైకదూరదొకో శుష్కపయోధరధారి బేలయై.

### ఇతరకృతవస్తుప్రకాశము.

ఉ॥ ధర్మపరుండులోకమునఁ దద్దయుఁగీర్తి గణింపఁబ్రాజ్ఞుఁడా
నిర్మలకీర్తిఁ గావ్యముల నిక్కమువర్ణనఁ జేయవర్థిలుఁ
శర్మముఁగాంచి నీరమునఁజారుతరాబ్జము సూర్యరశ్మిచే
నిర్మలశోభఁదాల్పదొకొ నిశ్చలసంపదకు న్నిధానమై.

### బహులఘుతరసాధ్యము.

చ॥ పదుగురుదుర్జనుల్కలిసి పాయనిచెల్మినిజేయ వారితో
విదితబలుండు మర్త్యుఁడుభువింగడుమార్కొని పోరఁజాలఁడ
య్యదియెటులన్న బాలతృణముల్లనఁగూర్చినత్రాటిచేమహా
మదగజమైనఁగట్టువడి మానదె మానసమున్నతార్భటిన్॥

### దైవబలము.

ఉ॥ పంతమునన్నరుండొకఁడు పౌరుషమాత్మవహించి కార్యము
న్నాంతముఁజేయజాలఁ డనయమ్మలదైవము సూడకుండిన
న్నంతయుసాగునే రథము చొక్కపుటశ్వయుగంబుగూర్చిన
న్వింతగఁజక్రమొక్కటి విభిన్నముసెంది తొలంగిపోవఁగన్.

### నీచమహిమ.

ఉ॥ వాక్కులమాధురీరస మవార్యగతిం గురిపించుపండితుం
డొక్కఁడులేకయున్నసభ నున్నతుఁడౌను జడుం డదెట్లన
న్నొక్కని పర్ణభాస్వదవనీరుహసంతతి లేనిచోట స
మ్యక్కళలేనియాముదపుమ్రాను ఘనంబువహించునెప్పుడున్

నిష్ఫలవ్యాపారము.

ఉ॥ కాసుగణింపనేరక వికాసముబుద్ధికిలేక మానవుం
డాసఫలింప యాచకసహాయముఁజేయఁగలేఁడుదుర్ధశా
భాసురగ్రీష్మమందునఁ గబంధవిహీనములైనగాపగ
ల్గాసిలుపాంథపాళికి సుఖస్థితి నీర మొసంగనోపునే

సుగుణపరిభావము.

చ॥ అగణితసద్గుణుండు సుగుణాన్వితునింగనుఁగొన్నమాత్రఁద
త్సుగణతతిన్వరించుగుణశూన్యుఁడు నిత్యముఁజెల్మిఁజేసిన
న్నగడిగణింపలేఁడు నళినీసుమనోమకరందభుక్తిభృం
గగణముపాలుగాక మఱిఁ గప్పకునెందు లభింపనేర్చునే

పూర్వకర్మానుభవము

ఉ॥ భూతలమందుమర్త్యుఁడుప్రభూతఫలంబునుఁగోరియార్యుల
జ్ఞాతమునందు భక్తిఁగొని చేరిభజించినఁబూర్వకర్మసం
ఘాతవిధంబుఁగాంచు శితికంఠగళస్థితసర్పవల్లభుం
డాతరుణేందుశేఖరకృపాప్తినిమానెనె గాలిమేతలై

కృతజ్ఞత

చ॥ అరసిమనీషియాదరము నార్యులకుంబ్రసరింపఁజేసిమే
ల్నిరతము నాచరించుఁ గడునేర్పరికాన నదెట్లులన్నచో
నరుఁడు జలమ్ములుంచి జతనమ్మునఁబెంచిన నారికేళము
ల్విరివిగఁ గాచియిచ్చుసరవి న్మధునీరము లెల్లవారికిన్

కృతఘ్నత

ఉ॥ చెంతకుఁదీసినిత్యము వశీకృతుఁజేసి ప్రియంబుఁజూపన
త్యంతముదుర్జనుండుహృదయంబునఁ గిల్బిషమున్విడండుచూ
సాంతముఁబాదుఁజేసిసుధఁజల్లిప్రసక్తివహించి పెంచిన
న్నంతయుఁజేదువాయునె వసుంధర నింబమహీజసంతతుల్

మహోపాయము.

చ॥ క్షితితలమందుఁ బ్రాజ్ఞుఁడు విశేషపరిశ్రమదూరుఁడై చమ
త్కృతిలఘుభూరియత్నములు రేయిఁబగల్లఘుభంగిఁ జేయు స
న్నుతపథమొప్పు నెట్టులన నూత్ననదీరఘురము ల్దటస్థితో
చ్ఛ్రితతరుఘాససంతతిఁ గ్రసించుట లేదె యొకేవిధంబుగన్॥

అత్యావశ్యకత.

చ॥ కరమునురక్తితోఁ బ్రజలఁ గంటికి రెప్పవిధానఁ బ్రోచు భూ
వరుఁడు లభింపకున్నఁ బ్రజ వైభవహీనతఁ జెంది నష్టమా
త్వరగతినావిక న్నడుప వారిధియందునఁ గర్ణధారుఁడే
దొరుకకయున్న మున్గదొకో తోరపునావికవస్తుపూర్ణమై

సేవ్యసేవకాంతరము.

మనుజుఁడొకండు సంతతము మానవనాయకు నాశ్రయించి తై
కొనుఁదదనుగ్రహంబుఁ దదకుంఠితసంపదఁ గాంచలేఁడు తా
ననిశము వేడి శంకరుఁ దదాదరణంబువహించు భక్తుఁడై
పనిగొని కాలకూటగళుప్రాభవమూనునె లబ్ధయత్నుఁడై॥

సాధునిబంధము.

చ॥ దొరకొని దుర్జనుండొకఁడు దుందుడుకొప్పు దురంతకృత్యము
ల్గరకరితైమె ఘటించునెడ గాసిలుఁగాదె సుహృజ్జనంబు ని
ష్ఠురుఁడు రావణాసురుఁడు జానకి వంచకుఁడై హరించుచో
శరధికి బంధనంబుఁ గపిసంఘముచే సమకూరెఁ దోడుతోన్॥

సమబలవిరోధము.

చ॥ అమితబలుండు దుర్బలులకారడిగూర్పక విక్రమాఢ్యుతో
సమరమొనర్చి తజ్జనితసత్వముమాపునుగాదె మిక్కిలి
న్భ్రమగతిఁబోవుచోఁ దృణము పై వడిఁబారక యప్రమత్తుఁడై
గమనము మానుతరూత్కరముఁ గంధవహుం డురుశక్తి సూపుచున్

దురాశాలంబనము.

ఉ॥ మందమనీషి యొక్కఁడు సమర్థునకబ్బెడు పూర్ణలాభము
న్నొందఁ దలంచి యత్నమును జేసిన నాతఁడు వొందఁబోఁడుగా
నిందితహ్రస్వబాహుఁడవని న్బృథువృక్షఫలంబుఁ గోరిన
న్నొందఁడె వంచనమ్మును హసింప జనుల్గడు విన్నఁబోవుచున్

జీవయాత్ర.

ఉ॥ మృత్యువహర్నిశంబుఁ గడిమి న్గనసంటి చరింప భూమిపైఁ
బ్రత్యహమందు వైభవముపట్ల నరుండు కృషి న్వహించెను
న్సత్య; మదెట్లన న్నివుఁడు సర్పమునోటను జిక్కి యీఁగల
న్హత్యనొనర్చఁ బొట్టకయి యాతురత న్గొను కప్ప భేలయై॥

ధూర్తలక్షణము.

ఉ॥ సమ్మతిఁ గోపవంతునకు శాంతవచస్సు లుపన్యసింపఁబో
హుమ్మని యాగ్రహించు విహితోక్తులు దెల్పెడి సౌమ్యవక్తపై
నిమ్మహిఁ బాపకంబున యథేచ్ఛగఁ గాచిన నాజ్యమందుఁ దో
యమ్ములు పోయ భగ్గుమని యద్దిర! మండు భయంకరమ్ముగన్

పరస్పరవిరోధము.

బలయుతుఁడెవ్వఁడోపఁడెడఁబాయుటకున్బృథుకోపజన్యమౌ
యలఘువిమోహమట్టినృపుఁడందఁగనోపఁడు రాజ్యసంపద
ల్పలుమరుఁ గృష్ణపక్షమున బంధురమౌ తిమిరంబుఁ గూడి రా
త్రిలలితచంద్రఘృష్టుల హరించును మీఱి దినక్రమంబుగన్

క్రోధప్రభావము.

చ॥ ఇలను బరస్పరంబుమది నీసున మంత్రులకుద్భవించు సం
కులమదదృష్టి సత్వరము గూల్చు సమూలముగా నృపాలకు
న్నెలఁగి ప్రచండవాతహతిచేనగు ద్రుమాకుల ఱాపిడి న్నగ
ల్గలిగి ధనంజయుండకట గాల్చు సవృక్షధరంబు బూదిగన్